## మందిరమా ? - మసీదా ??

# అయోధ్య వాస్తవ గాథ

ర చ న

ముక్కంటి



నవభారతి ప్రచురణలు
హైదరాబాద్

# ముందు మాట

గత కొద్ది సంవత్సరాలుగా దేశవ్యాప్తంగా రామజన్మభూమి, బాబరీ మసీదు విషయంలో వివాదం చెలరేగి, అనేక మంది అనేక రకాలుగా తర్జన భర్జనలు సాగిస్తున్న తరుణంలో చారిత్రిక, సత్యాలను పురాతత్వ వాస్తవాలను పాఠకులకు అందించాలనే ప్రయత్నంలో, శ్రీ ముక్కంటిగారు అడిగిన వెంటనే, శ్రమకోర్చి, పలు వాస్తవాలను క్రోడీకరించి, అందించినందుకు వారికి కృతజ్ఞతలు తెలియజేస్తూ రామజన్మ భూమి వివాదంలో వాస్తవాలను గమనించవలసిందిగా, ఈ చిరుపుస్తకాన్ని పాఠకులకు అందజేస్తున్నాం.



—ప్రకాశకులు

"నా గురించి అబద్ధాలు ప్రచారం చేయకు. నీ గురించిన నిజాలు బయట పెట్టవలసి వస్తుంది."

రాముని కన్న నేల మనదేశం. కోట్లాది భారతీయులకే కాక అటు నేపాలీయులకు, ఇటు ఇండోనీషియా, థాయిలాండు మొదలైన దేశాలలోని కోట్ల కొలది ప్రజలకు ఆరాధ్య దైవం, ఆదర్శ పురుషుడు ఐన శ్రీరాముడి జన్మ స్థలం నేడు సందేహాలకు నెలవైంది. 'రాముడు ఫలానాచోట పుట్టాడనటానికి ఋజువు ఏమిటి?' అంటూ కొందరు వివాదం లేవనెత్తుతున్నారు. 'మహ్మదు మక్కాలోనే పుట్టాడనటానకి ఋజువు ఏమిటి?'- 'క్రీస్తు బెత్లెహేములోనే జన్మించాడనడానికి ఋజువేమిటి?' అని ఎవరైనా ప్రశ్నించారా? ఒక వేళ ఎవరైనా అలా ప్రశించడానికి సాహసిస్తే ఏమవుతుందో ఒక్కసారి సల్మాన్‌రష్దీ ఉదంతం గుర్తు తెచ్చుకోండి. 'ఖురానులో ఫలానా విషయం ఉంది' అని రాసినందుకు రష్దీకి ఇరాన్ నియంత ఖుమేనీ మరణశిక్ష వేశాడు. ఇంతకీ ఖుమేనీ ఏమైనా ప్రపంచాధినేతా? కాదు. లేకపోతే రష్దీ ప్రజా విద్రోహం చేశాడా? అంతకంటే కాదు. అతడు ఒక నవల రాశాడు. ఆ నవల్లో ఒక పాత్రకు వచ్చిన కలలో ఖురాను గురించి లీలామాత్రంగా ప్రస్తావన వస్తుంది. అదీ అతగాడి తప్పు. అందుకని ఎక్కడో లండనులో ఉన్న రష్దీ మీదకి ఇరాన్ నియంత తన ఖూనీకోరు మూకలను ఉసిగొలిపాడు. ఏ దేశానికి చెందిన ముస్లిమైనా సరే రష్దీని ఖతం చెయ్యడం పవిత్ర కార్యం క్రిందికి వస్తుందని ప్రకటించాడు.

రష్టీ దాకా ఎందుకు మహమ్మదుగారి వెంట్రుక కాశ్మీర్‌లో మసీదు నుంచి దొంగిలించబడిందని కాశ్మీర్‌లోనూ, ఇతర ప్రాంతాలలోనూ మత కలహాలు రేపారు ముస్లింలు. నెహ్రూ మంత్రిమండలిలో ప్రముఖుడైన లాల్ బహద్దూర్‌శాస్త్రి కాశ్మీర్ వెళ్ళి ముస్లింలను సముదాయించాలని చూచాడు. కనిపించని హజరత్‌బాల్ (మహమ్మద్ వెంట్రుక) అన్వేషణకై సి.ఐ.బి. కి ఆ కార్యాన్ని అప్పగించారు. మాయమైన ఆ హజరత్‌బాల్ దానంతటదే కొద్ది రోజులలో దానిస్థానంలోనే ప్రత్యక్షమయింది. 'హజరత్‌బాల్' అంటూ కొలవబడుతున్న ఆ వెంట్రుక అసలు మహమ్మద్‌దేనని ఋజువు ఏమిటి? అట్లే దొరికింది, అదే వెంట్రుకనీ నిరూపణ ఏమిటి? అయినా అది నేడు ముస్లింలచేత పవిత్రంగా చూడబడుతుంది. కానీ దానిని నేడు ఎవరూ ప్రశ్నించరు.

క్రీస్తు గురించి అదేదో చెడుగా చూపించారని 'లాస్ట్ టెంప్టేషన్ ఆఫ్ క్రైస్ట్' అనే సినిమాను ప్రదర్శించకూడదని ఎంత గొడవ చేశారని! అమెరికాలో నిషేధించకపోయినా ఆ సినిమాను ఈ దేశంలో నిషేధించే దాకా నిద్రపోలేదు మన క్రైస్తవులు.

మరి రాముడు పుట్టిన గడ్డమీద రామాలయం కట్టుకోవడానికి ఎవరికో ఋజువులు చూపించుకోవలసిన పరిస్థితి ఎందుకు కలిగింది? కాంగ్రెసు వంటి రాజకీయ పార్టీలు తమ అధికారం నిలబెట్టుకోవడానికి, ఓట్లు దండుకోవడానికీ గత నలభై ఏళ్ళుగా హిందువులకు సంబంధించిన ప్రతి విషయాన్ని మతతత్వమని, జాతీయ సమగ్రతకు భంగకరమనీ ముద్రవేసి, మైనారిటీలను సంతోషపెట్టి పబ్బం గడుపుకో చూడటమే అందుకు ముఖ్యకారణం. కాంగ్రెసు పార్టీ ఆశ్రితులు, నెహ్రూ మార్కు సెక్యులరిజాన్ని ప్రచారం చేసే కొందరు మేధావులు మరొక అడుగు

ముందుకు వేసి ప్రస్తుతం ఉన్న బాబ్రిమసీదు రామాలయాన్ని పడగొట్టి కట్టినది కాదని తేల్చేశారు. పైగా హిందువులు చరిత్రను వక్రీకరిస్తున్నారని కూడా ఆరోపించారు. ఒకవేళ ఆలయం ఉండిన మాట నిజమైతే అందుకు ఋజువులు తెమ్మన్నారు. 'ది పొలిటికల్ ఎబ్యూస్ ఆఫ్ హిస్టరీ : బాబ్రిమసీద్ రామజన్మ భూమి డిస్ప్యూట్' (The poltical abuse of History : Babri Masjid Ram Janmabhomi Dispute) అని పేరుపెట్టి రొమిలా థాపర్, బిపిన్‌చంద్ర, హర్బన్స్‌ముఖియా మొదలైన వాళ్ళు ఒక చిరుపొత్తం ప్రకటించారు. దాంట్లో తమ వీర సెక్యులరిజాన్ని గుమ్మరించారు. వీళ్ళంతా పేరున్న చరిత్రకారులు. వాళ్ళు తమ కుహనా సెక్యులర్ దృక్పథాన్ని ఎంతగా ప్రదర్శించారంటే వారి పుస్తకం వల్ల లాభపడే ముస్లిములకే అసహ్యం వేసింది. వారు తమ పేరు ప్రతిష్ఠలను అడ్డుపెట్టుకుని ఉన్నది లేనట్లుగా, లేనిది ఉన్నట్లుగా, చెప్పవలసిన విషయాన్ని దాచిపెట్టి ఇలా నానారకాలుగా చరిత్రను వక్రీకరించడానికి తంటాలు పడ్డారు. వాళ్ళ అబద్ధపు ప్రచారాన్ని ఖండిస్తూ ప్రొఫెసర్ ఎ. ఆర్. ఖాన్ అనే చరిత్రకారుడు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలో 25-2-90 నాడు పెద్ద వ్యాసం వ్రాశాడు. అందులో ఆయన రొమిలా థాపరు మొదలైన వాళ్ళు చరిత్రను ఏవిధంగా వక్రీకరించారో ఉదాహరణలతో నిరూపించాడు. ఆ తరువాత థాపరు మొదలైన వాళ్ళు తమ దూకుడును పూర్తిగాతగ్గించుకుని, నసుగుతూ, నీళ్ళు నములుతూ, దాటవేస్తూ 1-4-90 నాడు మళ్ళా ఎక్స్‌ప్రెస్‌లో జవాబిచ్చారు. అదే సంచికలో ఖాన్ వారికి జవాబిచ్చాడు.

కొందరు మసీదును బాబరు ఆజ్ఞలమేరకు నిర్మించారని ఒప్పుకుంటూ - "ఐతే రాముడు జన్మించిన స్థలంలో నిర్మించబడిన గుడిని పడగొట్టి మసీదు నిర్మించారని ఋజువు ఏమిటి" అని వివాదం లేవదీశారు.

మహమ్మదు జన్మస్థలం గురించి, క్రీస్తు జన్మస్థలం గురించి రాని అనుమానాలు రామజన్మభూమి గురించి రావడాన్ని ప్రతి హిందువు ఖండిస్తాడు. రాముని గురించి, అధికారుల ప్రాపకం కోసం, స్వార్థం కోసం తమ మేధస్సును అమ్ముకునే చరిత్రకారుల పిచ్చి ప్రశ్నలకు సంజాయిషీ ఇచ్చుకునే అవసరం లేదు. ఆమాటకొస్తే రామజన్మభూమి విషయంలో రాముడు ఎక్కడ, ఎప్పుడు పుట్టాడు అనే విషయాలు ప్రశ్నించి, సందేహించే హక్కు ఎవరికీ లేదు. హిందువుల విశ్వాసాన్ని ప్రశ్నించేందుకు వీలులేదు. అలా జరిగితే ఈ కుహనా సెక్యులరిస్టుల సిద్ధాంతాల గురించి, విదేశీయిజాల గురించి, మతతత్వపు నిజస్వరూపం గురించి, హిందువులు రెట్టింపు ప్రశ్నలు అడుగగలరు. రాముడి జన్మ స్థలం గురించి హిందువుల దగ్గర ఉన్న ఋజువులలో సగం కూడా కుహనా సెక్యులరిస్టులు తమ సిద్ధాంతాల విషయంలో చూపలేరు. ఋజువుల గురించి మాట్లాడకపోవడమే వాళ్ళకు మంచిది. ఇంతకూ ఋజువులే చూపవలసివస్తే రామజన్మభూమి గురించిన అనేక పురావస్తు సంబంధమైన ఋజువులు లభిస్తాయి.

## వాస్తుపూర్వకమైన ఆధారాలు :

మార్చి 29, 1990 తేదీన న్యూఢిల్లీలో 'రామజన్మభూమి, బాబ్రీమసీదు' అనే విషయంపై పురావస్తు శాస్త్రజ్ఞుల సెమినార్ జరిగింది. "ఇప్పుడు లభిస్తున్న ఋజువుల ప్రకారం రామజన్మభూమి అని అనూచానంగా పిలవబడుతున్న స్థలంలో బాబరు ఆజ్ఞల మేరకు మసీదు నిర్మించబడింది" అని సెమినార్ అభిప్రాయపడింది

ఈ సందర్భంగా రెండు ముఖ్యమైన శాసనాలను పేర్కొన్నారు. అందులో ఒకటి బాబ్రిమసీదులోనూ, మరొకటి మసీదు వెలుపల ఉన్నాయి.

ఆ శాసనాలు బాబరు ఆజ్ఞల మేరకు మసీదు నిర్మించబడిందని పేర్కొంటున్నాయి.

ప్రొఫెసర్ కె. ఎస్. లాల్ అనే అనుభజ్ఞుడైన చరిత్రకారుడు సెమినార్‌కు అధ్యక్షత వహించాడు. "ఫైజాబాద్ జిల్లా గెజిటేరులో బాబరు అయోధ్యలో వారం రోజులు విడిదిచేశాడని రాముడి జన్మ స్థలంగా ప్రసిద్ధి చెందిన స్థలంలో ఒకగుడి ఉండేదని, దాన్ని బాబరు పడగొట్టించి మసీదు కట్టించాడని పేర్కొన్నట్టు" ఆయన చెప్పారు.

వి. కె. సౌందరరాజన్, భారతీయ పురావస్తు సంస్థ యొక్క అడిషనల్ డైరెక్టరు జనరల్‌గా పనిచేశారు. మసీదు నిర్మాణాన్ని చూస్తే గుడిని పడగొట్టి కట్టినట్లుగా స్పష్టమౌతుందని ఆయన చెప్పారు. మసీదు నిర్మాణంలో ఉపయోగించిన రాళ్ళు దేవాలయానికి చెందినవి. మసీదు గుబ్బలు దాని మీద కృతకంగా అమర్చినట్లు కనిపిస్తుందని మిగిలిన నిర్మాణంతో చూస్తే గుబ్బల ఆకృతి అతుకు పెట్టినట్లుగానూ, అసహజం గాను కనిపిస్తుందని సౌందరరాజన్ స్పష్టం చేశారు. పైగా మొగలులకు అలవాటైన నిర్మాణ శైలి ఈ కట్టడంలో కనిపించదని కూడా ఆయన వివరించారు

సెమినార్ లో పాల్గొన్న మరొక చరిత్రకారుడు శ్రీ లాల్ బహదూర్ బాబ్రీమసీదుకు మినార్‌లు లేవనే విషయాన్ని గుర్తు చేశారు. సాధారణంగా మసీదులకు నాలుగో, ఒకటో ఎత్తైన స్థంభాలవంటి మినార్‌లు ఉంటాయి. మినార్లు లేని మసీదులో ప్రార్థనలు చేయరని, మినార్‌లులేని మసీదు పూర్తయినట్లు కాదని, పవిత్ర స్థలంగా ప్రార్థనలకు ఉపయోగించే ఉద్దేశ్యం లేకపోయినప్పటికీ బాబరు అధికార దర్పాన్ని

చాటుకోవడానికి గుడిని కూల్చి మసీదు నిర్మించాడని లాల్‌బహదూర్ ఋజువు చేశారు.

కాగా బాబ్రిమసీదులో సామూహిక ప్రార్థనలు జరిగేవని చెప్పడానికి చారిత్రక ఆధారాలు లేవని, పైగా హిందువులు ఆ స్థలంలో నిత్య పూజలు జరిపే వారని చెప్పడానికి ఋజువులున్నాయని సెమినార్‌లో పాల్గొన్న వారంవరు ప్రకటించారు. అక్బరు కాలంలో దేవాలయం తిరిగి కట్టబడిందని, కాని ఔరంగజేబు దానిని పడగొట్టించాడని వారు అభిప్రాయ పడ్డారు. ఐనప్పటికీ హిందువులు దేవాలయ శిధిలాలను, స్థలాన్ని పవిత్రంగా ఎంచుతూ వచ్చారని, వాజిద్ అలిషా కాలంలో తిరిగి పూజా పునస్కారాలు ప్రారంభమయ్యాయని చరిత్రకారులు పేర్కొన్నారు.

కాని 1857 నాటి మొదటి భారత స్వాతంత్ర్య యుద్ధం తరువాత బ్రిటిష ప్రభుత్వం రామజన్మ భూమిలో పూజలు చేయరాదని నిషేధించింది. అంతకు కొద్ది కాలానికి ముందే ముస్లిములు అడ్డుపడడంవల్ల దేవాలయాన్ని తిరిగి నిర్మించడానికి ఫైజాబాద్ డిప్యూటీ కమీషనర్ అనుమతి ఇవ్వలేదు.

## వ్రాతపూర్వకమైన ఆధారాలు :-

అయోధ్యలోని బాబ్రిమసీదు గురించిన పూర్తి సమాచారాన్ని 1960 లో ప్రభుత్వం సేకరించి ప్రచురించింది. 1528 లో బాబరు ఆజ్ఞపై రామజన్మ స్థానంలోని దేవాలయాన్ని పడగొట్టి ఆ శిధిలాలపై మసీదును నిర్మించినట్లుగా పై సమాచారం ధృవీకరిస్తోంది.

కాని సయ్యద్ షహబుద్దీన్ వంటి ముస్లిం మతోన్మాదులు, రోమిలా థాపర్ వంటి కుహనా సెక్యులరిస్టులు ఒక కొత్త వాదనను లేవనెత్తారు.

ఫైజాబాద్ గెజిటీర్ మొదలైనవి బ్రిటిషు వాళ్ళు వ్రాసిన వ్రాతలని, హిందువులకు ముస్లిములకు మధ్య విభేదాలు కల్పించడానికి గుడిని పడగొట్టి మసీదును కట్టారనే కథను కల్పించారని, కాబట్టి ముస్లిం చరిత్రకారులు వ్రాసిన ఆధారం దొరికితే రామాలయాన్ని పడగొట్టి బాబ్రిమసీదును కట్టినట్లు అంగీకరిస్తామని సవాలు చేశారు. షాబుద్దీన్ చదువుకున్నది ఇంగ్లీషు చదువు. రొమిలాథాపరు రాసే చరిత్ర పుస్తకాలకు ఆధారం విన్సెంటు స్మిత్ మొదలైన గ్రంథాలు. అప్పుడు పనికి వచ్చిన ఇంగ్లీషు ఆధారాలు హిందువుల హక్కును ఒప్పుకోవలసి వచ్చేసరికి వారికి పనికి రానివయ్యాయట! చూశారా మన దేశస్థితి. ఇది నేటి దొంగ సెక్యులరిజం మహిమ. అసలు షాబుద్దీన్, థాపర్‌లకు హిందువులకు రామజన్మ భూమిపై ఉన్న హక్కును ప్రశ్నించే అర్హత లేదు. వారు అడిగారు కదాని ఋజువులు చూపవలసిన అవసరం లేదు. కాని సభ్య ప్రపంచం కోసం ఋజువులు చూపాలి.

ముస్లింల దండయాత్రలలో దేవాలయ విధ్వంసము వారి ప్రధాన కార్యమన్న విషయం తెలుసుకొనడానికి చరిత్రలు చదవ వలసిన అవసరం లేదు. కాశీ, మధురలు నేటికి స్పష్టంగా సాక్ష్యాలు. సోమనాథ దేవాలయం గజనీచేత విధ్వంసం కాబడిన విషయం ఈ చరిత్రకారులు ఎంత దాచటానికి ప్రయత్నించినా దాగని సత్యం. అందాక దేనికి ఆంధ్రలో పెనుగొండలోని మసీదులు గానీ ఏ సాధారణ వ్యక్తికైనా అవి ఒకప్పటి దేవాలయాలేనని, మసీదులుగా మార్చబడ్డాయని స్పష్టంగా తెలుస్తుంది. అక్కడ ముస్లిం సోదరులు కూడా ఈ విషయాన్ని బాహాటంగా అంగీకరిస్తారు. ఆ మసీదులలో దేవాలయ రూపురేఖలు కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి. అదేవిధంగా రాజమండ్రి పెద్ద మసీదు ముఖద్వారం, మసీదును గమనించినా అది ఒకప్పటి వైష్ణవాలయమనే విషయాన్ని చెబుతునే ఉంది.

ఈ కుహనా చరిత్రకారులు స్పష్టంగా కనిపించే చరిత్రకు మసిపూసి మారేడుకాయ చేయాలనుకోవడం అమాయకత్వమే అవుతుంది.

సరే ఈ విషయాలు చూడండి. ముస్లిములు కట్టిన మసీదులు నూటికి తొంభై శాతం ముస్లిమేతరుల నుంచి లాక్కున్న స్థలాలలో కట్టినవే. ఆ మాటకొస్తే చరిత్ర ఆధారాల ప్రకారం 'కాబా' కూడా కాఫిర్ల నుంచి గుంజుకున్న స్థలంలో కట్టినదే. షాబుద్దీన్ ఈ విషయాన్ని మరచిపోయాడు.

షాబుద్దీన్ తప్పిదాన్ని అబ్దుల్ రహమాన్ అనే ముస్లిం చరిత్ర కారుడు ఈ విధంగా సవరించాడు- "కొన్ని మసీదులను పడగొట్టబడిన దేవాలయాలకు దగ్గరగా కాని. కొద్ది దూరంలో కాని కట్టివుండటానికి ఆస్కారం ఉంది. కాని ఎక్కడా కూడ గుడిని పడగొట్టి అదే స్థలంలో మసీదు కట్టడం జరగలేదు" ('బాబ్రీమసీదు' అనే పుస్తకంలో పుట 19; 3వ ముద్రణ, దారుల్ మసన్నిఫిన్‌షిబ్లి అకాడమీ, 1987 ప్రచురణ.)

ఇదీ ముస్లిం చరిత్ర కారుల అభిప్రాయం. ఇందులో కోడిగుడ్డుకి ఈకలు లాగే ఛాందస్తపు మనస్తత్వం పుష్కలంగా ఉన్నప్పటికీ కొన్ని నిజాలు బయటపడతాయి. ముస్లిములు గుడులను పడగొట్టినమాట నిజమే. అలా పడగొట్టిన గుడి ప్రక్కనో, పది గజాల దూరంలోనో మసీదులు కట్టినమాట కూడా నిజమే. ఐతే గుడి పునాదుల మీదనే మసీదు కట్టిన మాట అబద్ధం ఇదీ అబ్దుల్ రహమాన్ అభిప్రాయం. అంటే గుడి శిధిలాల మీద మసీదులు ఎక్కడా కట్టలేదనీ, అది చాలా గొప్ప విషయమన్నట్లు గాను, అసలు విషయం కంటే ముఖ్యమన్నట్లుగానూ నొక్కివక్కాణించాడు. ఎలాగైనా సత్యాన్ని ఒప్పుకోకుండా బుకాయించి తప్పించుకోవాలనే తపన కనిపిస్తుంది, అతడి మాటల్లో.

ఇంకొకటి చూద్దాం. షారియా ప్రకారం అన్యాయంగా ఆక్రమించు కున్న భూమిలో మసీదు కట్టరాదనే నిబంధన ఒకటి కనిపిస్తుంది. (ఫత్వా - ఇ - ఆలంగీరీ-ఆరవ సంపుటి, పుట 214). కాని ఆ నిబంధన జిహాద్‌లో ముస్లిములు ఆక్రమించుకున్న స్థలాలకు కూడా వర్తిస్తుందా? (ముస్లిముల సిద్ధాంతం ప్రకారం ముస్లిమేతరులను చంపి, చెరపట్టి, దోచు కుని, మతం మార్చి, బానిసలుగా చేసుకోవడానికి ప్రకటించే పవిత్ర యుద్ధం జిహాద్. ఆ జిహాద్‌లో ముస్లిములు ముస్లిమేతరుణ్ణి ఏం చేసినా, ఎలా చేసినా, అది పవిత్ర యుద్ధం క్రిందే లెక్క). అంటే ఆ నిబంధన అందుకు వర్తించదు. ముస్లిములు జిహాద్‌లో ఆక్రమించిన స్థలాల్లో దేవాలయాన్ని పడగొట్టి అదే స్థానంలో మసీదు నిక్షేపంగా కట్ట వచ్చు. ప్రవక్త మహమ్మదు సమస్తమైన భూమి అల్లాకు లేక తనకు, తద్వారా ముస్లిములందరికి చెందుతుందని చెప్పాడు. (బుఖారి II కితాబ్ ఆల్-జిహాద్‌వా-సియార్ హాదిల్ 406.)

14వ శతాబ్దికి చెందిన ముస్లిం మత పండితుడు, న్యాయవేత్త ఇబ్న్ తైమియ్యా అసలీ భూమంతా ముస్లిములదేనని, జిహాద్‌ద్వారా తిరిగి వాళ్ళకు చేరుతుందని నొక్కి చెప్పాడు. అంటే అతడి దృష్టిలో ప్రపంచంలో ముస్లిములు తప్ప మరేజాతి, మతము ఉండరాదు, ఒకవేళ ఉన్నప్పటికీ వాళ్ళ భూమి వాళ్ళది కాదు, ముస్లిములదే. ఈ సూత్రం ప్రకారం ముస్లిములు భూమిని లాక్కుంటే, కబ్జా చేస్తే అది న్యాయ సమ్మతమే.

కాబట్టి కూలగొట్టిన దేవాలయం మీద మసీదు కట్టడానికి షారియా ఒప్పుకోదనే మాట వట్టి బుకాయింపు. షారియా నిక్షేపంగా ఒప్పుకుంటుంది. అంతేకాదు అలా చెయ్యడం ముస్లిముల పవిత్ర కర్తవ్యం అని కూడ బోధిస్తుంది.

బ్రిటిష ఆధారాలతో సంబంధం లేని కేవలం ముస్లిం ఋజువులు కొన్ని చూడండి. వీటి ప్రకారం రామజన్మ భూమిలో దేవాలయాన్ని పడ గొట్టి అదే స్థానంలో బాబ్రీమసీదును నిర్మించినట్లు స్పష్టమౌతుంది :—

(a) నవంబరు 30 తేదీ 1858 వ సంవత్సరంలో మహ్మద్ అర్షగర్, ఖాతిబ్ మరియు ముఅజ్జిన్, బాబ్రిమస్జిద్ (ఖాతిబ్, ముఅజ్జిన్ అనేవి పదవులు లేక బాధ్యతలు)అనే అతడు బాబ్రీమసీదుకు సంబంధించిన వివాదంలో 'బైరాగియా-ఇ-జన్మస్థాన్'లకు వ్యతిరేకంగా (అంటే రామ జన్మ స్థానపు బైరాగులకు వ్యతిరేకంగా) కోర్టులో కేసు వేయడానికి దర ఖాస్తు పెట్టాడు. ఆయన కోర్టుకు పెట్టుకున్న దరఖాస్తులో బాబ్రీమసీదును 'మస్జిద్ - ఇ - జన్మస్థాన్' (అంటే జన్మస్థానపు మసీదు) అనీ, మసీదుకు ముందర ఉన్న ప్రాంగణాన్ని, మసీదులో ఉన్న అరుగును కలిపి 'మకామ్ జన్మస్థాన్ కా' (అంటే జన్మస్థానపు జాగా) అనీ పేర్కొ న్నాడు. బైరాగులు ప్రాంగణంలో కట్టిన ఒక అరుగును పడగొట్టిం చాలని కోర్టుకు విన్నవించాడు. వందల సంవత్సరాలుగా జన్మస్థానపు జాగా తమ (అంటే ముస్లిముల) ఆలన పాలన నోచుకోకుండా పడి ఉందని, హిందువులు అక్కడ పూజలు చేస్తూనే ఉన్నారని అష్గల్ తన దరఖాస్తులో పేర్కొన్నాడు. (చూ. సయ్యద్ షహాబుద్దీన్ అబ్దుల్ రహమాన్ వ్రాసిన బాబ్రి మస్జిద్. పుట. 29, 30).

అంటే దీనివల్ల నేడు బాబ్రి మసీదు అని పిలిచే మసీదును ఆనాడు 'జన్మస్థాన్ మసీదు' అనేవారని మసీదు ప్రాంగణాన్ని "జన్మస్థానపు జాగా" (లేక ఒట్టి జన్మస్థానం) అనేవారని, అనేక వందల సంవత్సరాల నుంచి హిందువులు అక్కడ పూజలు చేస్తూ వస్తున్నారని స్పష్టమౌతుంది,

(b) మరొక ఋజువు చూద్దాం - హాదికా-ఇ-షుహద అనేది మీర్జా జాన్ రచన. మీర్జా జాన్ అమీర్ అలీ అమేథావీ యొక్క నాయకత్వంలో హిందువుల మీద జిహాద్ (మత యుద్ధం) లో స్వయంగా పాల్గొన్నాడు. ఈ జిహాద్ 1855 లో నాజిద్ అలీషా కాలంలో జరిగింది. హనుమాన్ గడీని హిందువుల దగ్గరనుంచి స్వాధీనం చేసుకోవడం కోసం ముస్లిములు ఈ మతయుద్ధాన్ని నడిపారు. హనుమాన్ గడీ బాబ్రీ మసీదుకి కొన్ని వందల గజాల దూరంలో ఉంది. మీర్జా తన పుస్తకాన్ని జిహాద్ జరిగిన సంవత్సరంలోనే వ్రాశాడు. ఈ మరుసటి సంవత్సరం అంటే 1856 లో ఆ పుస్తకం లక్నోలో ప్రచురించబడింది.

ఈ పుస్తకాన్ని రయీస్ అహ్మద్ జఫారి తాను వ్రాసిన 'వాజిద్ అలీషా ఔర్ ఉస్కా అహద్" అనే గ్రంథలో 9 వ అధ్యాయంగా పొందు పరిచాడు. (లక్నో. కితాబ్ మంజిల్, 1957).

మీర్జా జాన్ ఒక ప్రత్యక్ష సాక్షి. అతడు ఏం చెపుతున్నాడో చదవండి— "సయ్యద్ సాలార్ మసూద్ కాలంనుంచీ కూడా ముస్లిం పాలకులు హిందువుల దేవాలయాలను పడగొట్టి మసీదులు, మఠాలు, సత్రాలు కట్టించి ఇస్లాంను వ్యాప్తిచేస్తూ వస్తున్నారు. అదేవిధంగా ఫైజాబాద్ అవధ్‌ల్లో కాఫిర్ల మతాన్ని తుడిచిపెట్టారు. ఆ ప్రాంతాలు రాముడి తండ్రి యొక్క రాజధాని. గొప్ప మత కేంద్రం. అక్కడ ఒక పెద్ద గుడి ఉంది. దాన్ని స్థానంలో వారు (ముస్లిం పాలకులు) పెద్ద మసీదు నిర్మించారు. చిన్న మండపం ఉన్నచోట ఒక చిన్న మసీదును నిర్మించారు. (మస్‌జిద్ - ఇ - ముక్తసర్ - ఇ - కనతి)." మీర్జాజాన్ తాను పురాతన, సమకాలిక ఆధారాలు రెంటిపైనా ఆధారపడినట్లుగా పేర్కొన్నాడు.

(c) మరొక ముస్లిం ఆధారాన్ని చూద్దాం - షేక్ అజ్మత్ అలీ కౌరావి నామి (1811-1893) అనే ఆయన మురగహ్-ఇ-ఖుస్రవి అనే గ్రంథంలో రాశాడు. ఆ గ్రంథాన్ని తారిఖ్-ఇ-అవధ్ అని కూడా పిలుస్తారు. షేక్ అజ్మత్ అలీ వాజిద్ అలీషా కాలంలో జీవించి, అప్పటి పరిస్థితులను కళ్ళారా చూసిన వాడు. అతడి గ్రంథం 1869లో పూర్తయినప్పటికీ, 1986లో మాత్రమే ప్రచురించబడింది. ఫక్రుద్దీన్ అలి అహ్మద్ మెమోరియల్ కమిటీ, లక్నోవారి సహాయంతో డాక్టర్ జకీకాకొరావి ఆ గ్రంథాన్ని అచ్చువేశాడు అమీర్ అలీ అమెథావిహిందువులపైనడిపినజిహాద్‌ను వివరించే అధ్యాయాన్ని ప్రచురించకూడదని కమిటీ వారు నిషేధించడంతో డా. జకీ ఆ అధ్యాయాన్ని వదిలి మిగిలిన గ్రంథాన్ని 1986లో ప్రచురించి, ఆ ఒక్క అధ్యాయాన్ని 1987 లో 'అమీర్ అలీ షహీద్ ఔర్ మరకహ్-ఇ-హనుమాన్ గడీ' అనే పేరుతో ప్రచురించాడు. (ప్రచురణ సంస్థ మర్కజ్-ఇ-అదా ఇ-ఉర్దూ, 137, షహగంజ్, లక్నో-3)

పై గ్రంథంలో అజ్మత్ అలీకాకొరావి ఈవిధంగా పేర్కొన్నాడు- "పురాతన ఆధారాలనుబట్టి చూస్తే ముస్లిం పాలకులు ఆది నుంచీ మసీదులు మొదలైనవి కట్టించి ఇస్లామును వ్యాప్తి చేస్తూ వచ్చారు. అదేకాక వారు ముస్లిమేతర మతాలను, ఆచారాలను మధుర, బృందావనం మొదలైనవి తొలగించినట్లుగానే ఫైజాబాద్ అవధ్‌లోని జన్మస్థాన్ దేవాలయ స్థానంలో 923 అ. హి లో బాబ్రి మసీదును నిర్మించారు. అది రాముడి తండ్రి రాజధాని, గొప్ప మత కేంద్రం. సయ్యద్ మూసా ఆషికాన్ ఆధ్వర్యంలో బాబ్రీమసీదు నిర్మించబడింది.

డా॥ జకీ తను ప్రచురించిన గ్రంథంలో మీర్జారజబ్‌అలీబేగ్ సరూర్ (1787-1807) రచించిన ఫసానా- ఇ- ఇబ్రాత్‌లో కొంత

భాగాన్ని జోడించాడు. అందులో హనుమాన్ గడిలో ఔరంగజేబు ఒక మసీదు కట్టించడం, బైరాగులు దానిని తొలగించి గుడి కట్టడం మొదలైన వాటిని ప్రస్తావించే ఈ క్రింది వాక్యాలు కనబడతాయి. "గతంలో గుడుల్ని కూలగొట్టి మసీదులు కట్టారు. అయ్యో! ఇప్పుడు కాలం మారి పోయింది, మసీదును పడగొట్టి గుడి కట్టే కాలం వచ్చింది అంటూ సరూర్‌బాధ పడ్డాడు. ముస్లిములు పడగొట్టిన దేవాలయాన్ని హిందువులు తిరిగి నిర్మించడానికి ఎలా ప్రయత్నించారో పై వాక్యాలవల్ల కొంత తెలుస్తుంది.

3 a) జోసెఫ్ టిఫెంథలర్ (1710-1785) ఒక జెసూట్ ఫాదరీ అతడు ఆస్ట్రియా దేశస్థుడు. 1766-1771 సంవత్సరాల మధ్య టిఫెంథలర్ అవధ్ ప్రాంతంలో విస్తృతంగా పర్యటించాడు. తను పర్యటనలో గమనించిన విశేషాలను లాటిను భాషలో ఒక పుస్తకంగా వ్రాశాడు. అందులో అయోధ్యను కూడా వర్ణించాడు. 1786 లో జోసెఫ్ బెర్నూలీ అనే సుప్రసిద్ధ ఫ్రెంచి మేధావి టిఫెంథలర్ గ్రంథాన్ని ఫ్రెంచి భాషలోకి అనువదించాడు. (ఆ అనువాదం పేరు డిస్క్రిప్షన్ హిస్టారిక్ ఎట్ జాగ్రఫిక్ డి. లాఇండి). టిఫెంథర్ ఆంగ్లేయుడూ కాదు, అతడిపై ఆంగ్లేయుల ప్రభావము లేదు. రామజన్మభూమిపై ఆంగ్లేయులు మొదటిసారి తయారు చేసిన నివేదిక 1838 నాటిది. కాని టిఫెంథలర్ అంతకు పూర్వమే తన గ్రంథాన్ని వ్రాశాడు.

టిఫెంథలర్ రామజన్మభూమి ఆలయంగురించి ఈవిధంగా వ్రాశాడు—"ఔరంగజేబు రామ్‌కోట్ కట్టడాన్ని నాశనం చేసి ఆ స్థలంలో మూడు గుబ్బలు గల ఒక మహమ్మదియ దేవాలయాన్ని నిర్మించాడు. కొంపరు దాన్ని బాబరు నిర్మించాడని చెప్తారు. రామ్‌కోట్

శిధిలాలకు చెందిన 14 నల్లరాతి స్తంభాలు మసీదు కట్టడానికి, మిగిలిన రెండింటిని మసీదు లోపలి భాగంలోనూ ఉపయోగించారు. ఈ స్తంభాలు నిజానికి పూర్తి స్తంభాలు కావు. కొంత విరిగిపోయాయి. ఆ స్తంభాల మీద చెక్కడాలు ఉన్నాయి. ఈ స్తంభాలను సిలోన్ నుంచి వానరరాజైన హనుమంతుడు తెచ్చాడని చెపుతారు.

ఎడమ వైపున చతురస్రాకారంలో భూమికి ఐదు అంగుళాల ఎత్తులో ఒక వేదిక ఉంది. ఇక్కడే బెశ్చన్ (విష్ణువు) రాముడి రూపంలో జన్మించాడని అతడి ముగ్గురు తమ్ములు కూడా అక్కడే పుట్టారని చెపుతారు. తరువాతి కాలంలో ఔరంగజేబు (కొందరి సమాచారం ప్రకారం బాబరు) హిందువుల దుష్టమతాన్ని రూపుమాపడం కోసం దాన్ని నాశనం చేశాడు. కాని వాళ్ళు (హిందువులు) ఆ ప్రదేశాన్ని రాముడి జన్మస్థలంగా ఎంచి పూజలు చేస్తూనే వచ్చారు. అక్కడికి దగ్గర్లోనే మరొక ప్రదేశం ఉంది. అక్కడ తవ్వితే నల్లటి గట్టి బియ్యపు గింజలు వంటివి దొరుకుతాయి. ఆ బియ్యపు గింజలు రాముడి కాలంనుంచీ అక్కడ ఉన్నాయని ప్రజలు చెపుతారు. చైత్రమాసపు 24 వ రోజున రాముడి పుట్టిన రోజున అక్కడ పెద్ద ఉత్సవం జరుగుతుంది. ఇది భారతదేశ మంతటా ప్రసిద్ధమైన ఉత్సవం."

మసీదును కట్టించింది ఔరంగజేబా, బాబరా అనే విషయం టిఫెంథలర్‌కి నిశ్చయంగా తెలియదు. కాని నేడు మన దగ్గరున్న సమాచారం ఆ సందేహాన్ని తీరుస్తుంది. మసీదులో కనుగొన్న శాసనంలో మసీదును ఎవరు కట్టారో స్పష్టంగా ఉంది. బాబరు మీర్‌బాకీని అవధ్ గవర్నరుగా నియమించాడు. అతడు క్రీ. శ. 1528 లో బాబరు ఆజ్ఞ ప్రకారం రామజన్మభూమి దేవాలయాన్ని పడగొట్టి బాబ్రీ మసీదును

నిర్మించాడు. టిఫెంథలర్ మసీదు నిర్మాణంలో ఉపయోగించిన దేవాలయ స్తంభాలను కూడా పేర్కొన్నాడు. ఐతే ఆతడు కొన్ని స్తంభాలను మాత్రమే చూడగలిగాడు. తరువాతి కాలంలో. ఇంకా బైటపడ్డాయి.

టిఫెంథలర్ వ్రాతలను నేడు మనకు తెలిసిన ఆధారాలతో పోల్చి చూస్తే అవి బ్రిటిషువాళ్ళు విభజించి పాలించడానికి, కల్పించిన కట్టు కథలు కావని స్పష్టమౌతుంది. హిందువులు 18 శతాబ్దం నాటికి మసీదును దాని ముందున్న ప్రాంగణాన్ని కూడా వశపరుచుకున్నారని టిఫెంథలర్ రచన వల్ల తెలుస్తుంది. జన్మభూమి గురించే కాక ఆయన స్వర్గద్వారం, నవల్ రాయ్‌ఘాట్, సీతాకీరసోయి (సీతమ్మ వంటిల్లు) మొదలైన చారిత్రాత్మక స్థలాలను వర్ణించాడు.

(b) రామ్‌కోట్‌లో రామ జన్మభూమి దేవాలయం ఉన్నట్లుగా అయోధ్య మహత్యం చెపుతోంది. అయోధ్యా మహత్యం హిందువుల పురాణాలలో ఒకటైన స్కాంద పురాణం లోనిది. స్కాంద పురాణం బాబరు దండ యాత్రకు అనేక వందల ఏళ్ళ పూర్వం వ్రాయబడింది. అనేక సార్లు ముస్లిములు దేవాలయాన్ని పడగొట్టడం, హిందువులు తిరిగి కట్టడం జరిగింది. అలా తిరిగి తిరిగి కట్టేప్పుడు గుడిప్రాకారం కూడా మారుతూ వచ్చింది. అయోధ్యామహత్యంలో రామనవమి నాడు రామజన్మస్థానంలో పూజలు చేస్తే గొప్పపుణ్యం కలుగుతుందని చెప్పబడింది. అందులో పేర్కొన్న ఇతర పుణ్యస్థలాలైన స్వర్గద్వారం, గోప్తర్‌ఘాట్, మణిపర్వత్ మొదలైనవి నేడు కూడా స్పష్టంగా గుర్తించవచ్చును. కాని అందులో వర్ణించిన రామజన్మభూమి దేవాలయం మాత్రం నేడు కనబడదు దానిస్థానే మసీదు కనబడుతుంది. ఈ పురాణ క్షేత్రాన్ని తిరిగి ఆక్ర

మించుకుని పూజలు కొనసాగిస్తున్న హిందువులపైకి 1855లో దాడి చేసి 70 మంది ముస్లిములు చనిపోయరు. వాళ్ళ గోరీలు 'గంజ్‌షహీదన్' పేరున ఆ దగ్గరలోనే కనిపిస్తాయి. గత రెండున్నర శతాబ్దాలుగా అనేక మంది టిఫెంథలర్ (1766-71) వంటి యాత్రికులు; మార్టిన్ (1838) కార్నిజీ (1870), నెవిల్లీ (1905) వంటి సర్వేయర్లు; కన్నింగ్‌హాం(1862) ఫుర్‌హార్ (1891) వంటి పురావస్తు శాస్త్రజ్ఞులు, బెవరిడ్జ్ (1922) వంటి చరిత్రకారులు; హాన్స్ బక్కర్ (1984) వంటి పరిశోధకులు రామజన్మ భూమి దేవాలయాన్ని గురించి, దాని శిథిలాలపై బాబరు కట్టించిన మసీదు గురించి సాక్ష్యమిస్తూ వచ్చారు. వివిధ దేశాలకు చెందిన వేర్వేరు శాస్త్రాలను ఉపయోగించి, వేర్వేరు కాలాలకు చెందిన వ్యక్తులు ఒకే నిర్ణయానికి వచ్చారంటే ఆ విషయానికి అంతకంటే ఋజువు మరేం కావాలి? ఇంకా ఋజువు కావాలి అనే చరిత్రకారుల చరిత్రను సందేహించవలసి వస్తుంది. వీళ్ళు తాము వ్రాసే చరిత్రలు ఎలా వ్రాస్తారో మరి!

**4) పురావస్తు సంబంధమైన ఋజువులు:-** డాక్టర్ స్వరాజ్ ప్రకాశ్ గుప్త, అహ్మదాబాద్ మ్యూజియం మాజీ డైరెక్టరు. ఆయన జైన ఆచార్య సుశీల్‌ముని అధ్యక్షతన ఏర్పడిన కమిటీ మెంబరు. ఈ కమిటీ వివిధ మతాల ప్రతినిధులతో ఏర్పడింది. రామజన్మభూమి - బాబ్రిమసీదు వివాదాన్ని పరిష్కరించడం ఈ కమిటీ ముఖ్యోద్దేశం. ఆ ప్రయత్నంలో రామజన్మభూమిని దర్శించిన వారిలో డా॥ గుప్త ఒకరు. ఒక చరిత్ర కారుడిగా, పురావస్తు శాస్త్రవేత్తగా రామజన్మభూమికి సంబంధించిన అనేక ఋజువులను ఆయన చూపించారు. అంతేకాదు రామజన్మభూమిలో జరిగిన ఇతర పురావస్తు పరిశోధనల వివరాలను కూడా ఇచ్చారు.

1975-80 సంవత్సరాల మధ్య భారత ప్రభుత్వం తరపున ప్రొఫెసర్ B. B. లాల్ నాయకత్వాన బాబ్రీ మసీదులో పురావస్తు

పరిశోధనకై త్రవ్వకాలు సాగాయి. B. B. లాల్ భారత పురావస్తు సంస్థ (Archaelogical Survey of India - A.S.I.) డైరెక్టరుగా, సిమ్లాలోని ఇన్స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్డ్ స్టడీస్ డైరెక్టరుగా పనిచేసిన సుప్రసిద్ధ పురావస్తు శాస్త్రవేత్త. ఆయనతోపాటు త్రవ్వకాలను పర్యవేక్షించిన మరో ఇద్దరు పురావస్తు శాస్త్రవేత్తలు డా॥ కె. వి. సౌందరరాజన్' డా॥ కె. ఎన్. దీక్షిత్. వీరంతా 'ఆర్కియాలజీ ఆఫ్ ది రామాయణ సైట్స్' (అంటే 'రామాయణ స్థలాలలోని పురావస్తు సంపద') అనే పరిశోధనా ప్రణాళికలో భాగంగా అయోధ్యలో త్రవ్వకాలు జరిపారు. వారి పరిశోధనలో అనేక విషయాలు తెలిశాయి. రామజన్మభూమి వివాదానికి సంబంధించి ముఖ్యంగా కావలసినది క్రీ. శ. 10-16 శతాబ్దాల మధ్యకాలం. ఆ కాలానికి చెందిన పురావస్తు వివరాలు ఇలా ఉన్నాయి :

బాబ్రీ మసీదు వెనుక గోడను తాకుతూ, మసీదుపునాదుల క్రిందకు విస్తరిస్తూ త్రవ్వకం జరిపారు. దానిలో దొరికిన ఆధారాల ప్రకారం ఆ స్థలంలో 8-10 శతాబ్దాల మధ్య కాలంలో అక్కడ జనావాసం లేకుండా వదిలి వేయబడింది. 11 వ శతాబ్దిలో ప్రజలు తిరిగి ఆ స్థలాన్ని ఉపయోగించసాగారు. ఆ కాలానికి చెందిన అనేక స్తంభపు దిమ్మలు (అంటే స్తంభాలను నిలబెట్టడానికి కావలసిన పునాది కట్టడాలు) బయటపడ్డాయి. ఈ దిమ్మలను కాల్చిన ఇటుకలతో కట్టారు. ఒక్కొక్క దిమ్మ మీటరు ఎత్తు ఉంది. దిమ్మకు దిమ్మకు మధ్య ఖచ్చితమైన దూరాన్ని ఉంచి కట్టారు. దిమ్మలకు పైన స్తంభాలను నిలబెట్టి అతుకు పెట్టేందుకు ఉపయోగించిన సున్నం పెచ్చుల మాదిరిగా ఇప్పటికీ మిగిలిఉంది. దిమ్మల కొలతలను, మసీదు కట్టడంలో ఉపయోగించిన స్తంభాల కొలతలను సరిపోల్చి చూస్తే ఆ దిమ్మలను స్తంభాలను నిలబెట్టడానికై ఉపయోగించినట్లు రూఢి అవుతోంది.

స్తంబాలను ఫోటోలు తీసి, వాటిపైగల చెక్కడాలను పరిశీలించి, ఆ వివరాలను నమోదు చేశారు. రామ జన్మ భూమి దేవాలయ చెక్కడాలను ఉత్తర భారతదేశంలో గల సమకాలీన ఆలయాల చెక్కడాలతో పోల్చి చూశారు. ఆ పరిశీలన ఫలితంగా రామ జన్మభూమి త్రవ్వకాలలో బయటపడిన శిధిలాలు ఒక హిందూ దేవాలయానివని, 11 వ శతాబ్దిలో కనోజును పాలించిన గహడవాల రాజుల ఆధీనంలో అయోధ్య ఉన్నప్పుడు కట్టిన కట్టడమని తెలుస్తోంది. ఆ ఆలయానికి చెందిన స్తంభాలనే బాబ్రీ మసీదు నిర్మాణంలో ఉపయోగించారు. మసీదు కట్టడంలో అటువంటి 14 స్తంభాలను 'భారవాహక' (అంటే కట్టడపు బరువును మోసే) స్తంభాలుగా ఉపయోగించారు అటువంటివే మరి రెండు స్తంభాలను ఒక కిలోమీటరు దూరంలోగల మూసా ఆషికన్ యొక్క సమాధి కట్టడంలో తలక్రిందులుగా ఉంచి ఉపయోగించారు. మూసా ఆషికన్ ముస్లిం మత గురువు. అతడు రామజన్మభూమి ఆలయాన్ని పడగొట్టమని బాబరు అనుచరుడైన మీర్ బాకీకి సలహా ఇచ్చాడు. ఈ 16 స్తంభాలు కాక మరి నాలుగు స్తంభాలు మూసా ఆషికన్ సమాధిలో ఉన్నాయని సమాధి ప్రక్కనే ఉన్న పొలం యొక్క స్వంతదారు నిర్ధారించాడు. మసీదుకు వందగజాల దూరంలో ఆలయ ద్వారం యొక్క ఒక నిలువు పలక పడిఉంది. అది స్తంభాలను చేయడానికి ఉపయోగించిన రాయితోనే చేయబడింది. పలకమీద పై నుండి క్రింది వరకూ చెక్కడాలు చెక్కి ఉన్నాయి.

స్తంభాలు, ద్వారపు పలకలపై ఉన్న చెక్కడాల వివరాలవల్ల అవన్నీ ఒకే హిందూ దేవాలయానివని స్పష్టమౌతుంది. చెక్కడాలను గురించిన వివరాలను చూడండి.

స్తంభాల ఎత్తు సుమారు 5½ అడుగులు ఉంటుంది. వాటన్నింటి మీద పై నుంచి క్రింది వరకూ శిల్పాలు చెక్కబడి ఉన్నాయి. స్తంభం యొక్క అడుగు చతురస్రాకారంగా ఉంది. స్తంభం దిగువ భాగం నలుగురు యక్షులచేత మోయబడుతున్న పూర్ణకుంభం రూపంగా చెక్కబడింది. యక్షులు బరువు మోస్తున్న వైఖరి, వాళ్ళ శరీరాకృతి మొదలైనవి భారతీయ శిల్ప సాంప్రదాయంలో క్రీ. పూ. 2 వ శతాబ్దికి చెందిన సాంచీ మొదలైన చోట్ల కనిపించే శిల్పకళను పోలి ఉన్నాయి. పూర్ణ కుంభం మీద అనేక లతలు, రేఖాకృతులు, తామర రేకులు చెక్కబడి ఉన్నాయి. స్తంభం నడిమి భాగం 16 ముఖాలుగా చెక్కబడింది. పూర్ణ కుంభం నుండి వెలువడిన అనేక లతలు మొదలైనవి స్తంభం నడిమి భాగానికి పాకినట్లుగా చెక్కారు. అలా పాకిన తామర పువ్వుల్లో దేవ కన్యలు త్రిభంగ ఆకృతిలో నిలబడి ఉన్నట్లుగా చెక్కారు. కాని దుండగులు ఈ దేవ కన్యల ముఖాలు చెక్కేశారు. అలాగే స్పష్టమైన రేఖలతో తీర్చిన హంసలను కూడా చెక్కేశారు. ఇటువంటి శిల్పాలు 5 వ శతాబ్దికి చెందిన గుప్తుల కాలానికి చెందిన శిల్ప సాంప్రదాయాన్ని పోలి ఉన్నాయి. స్తంభం యొక్క 16 ముఖాలపై పువ్వులు, తీగలు చెక్కబడ్డాయి. దీనిని మాలాబంధం అంటారు. ఈ మాలాబంధం పైభాగాన్ని స్తంభపు శిరస్సు అంటారు. దీని పైన కూడ అనేకమైన లతలు, పువ్వులు చెక్కబడి ఉన్నాయి. స్తంభం పై భాగం చదునుగా ఉండి దేవాలయపు కట్టడానికి ఆధారంగా ఉంది.

ఇక ఆలయ ద్వారపు నిలువు పలక (ద్వార శాఖ) రెండు ముఖాలపై శిల్పాలు కనిపిస్తాయి. ఒక వైపు లతలు, ఆకులు, మరొక వైపు రేఖాకృతులు చెక్కబడి ఉన్నాయి. రేఖాకృతులు ఉన్నవైపునే దిగువుగా ఒక ద్వారపాలకుడు చేతిలో త్రిశూలం పట్టుకున్నట్లుగా, అతని

చేతులపై ఉత్తరీయం వ్రేలాడుతున్నట్లుగా చెక్కబడి ఉంది. అదే ముఖానికి పై భాగంలో దేవకన్యలను చెక్కారు. ఈ శిల్పాలు 11 వ శతాబ్దికి చెందిన హిందూదేవాలయానివని కచ్చితంగా చెప్పవచ్చు.

మసీదులో దొరికిన రెండు పర్షియన్ శాసనాలను బట్టి ఆ మసీదు 1920 నాటికి చెందినదని తెలుస్తోంది. ఇంకొక ముఖ్యవిషయ మేమిటంటే ఉత్తర భారతదేశంలో (అయోధ్యతో సహ) గత అనేక సంవత్సరాలుగా జరిగిన పురావస్తుత్రవ్వకాల్లో ఎక్కడా కూడ ఇదే మాదిరి స్తంభాలు దొరకలేదు. కాబట్టి బాబరు రామజన్మభూమి ఆలయాన్ని పడగొట్టి అ స్థలంలో మసీదు కట్టలేదని, అసలు ఆక్కడ ఆలయమే లేదని, మరెక్కడో దొరిగిన స్తంభాలను ఇక్కడికి తీసుకువచ్చి ఇక్కడ బాబ్రీ మసీదును కట్టారని కొందరు చేసే వాదనకు ఎటువంటి ఆధారమూ లేదు. రామజన్మభూమి దేవాలయం ఏనాటి నుంచో అక్కడ ఉంటూ వచ్చింది. హిందువులు దానిలో పూజలు చేస్తూవచ్చారు. 1528 లో బాబరు అనుచరుడు మిర్‌బాకీ ఆ ఆలయాన్ని పడగొట్టించి దాని స్తంభాలను ఉపయోగించి అదే స్థలంలో బాబ్రీమసీదును కట్టించాడు. ఈ విషయాన్ని పై చూపించిన అనేక రచనలు, పురావస్తు ఆధారాలు ఋజువు చేస్తాయి. ఇన్ని ఋజువులు ఉన్నప్పటికీ రోమిలా థాపర్, సర్వేపల్లిగోపాల్, బిపిన్ చంద్ర మొదలైన కొందరు చరిత్రకారులు రామజన్మభూమికి సంబంధించిన సత్యాలను ఒప్పుకోలేకుండా ఉన్నారు. 'బాబ్రీమసీదు—రామజన్మభూమి వివాదం చరిత్రదుర్వినియోగం' (The political abuse of History-BabriMasjid-RamJanmabhoomi Dispute) అనే పేరున ఒక చిన్న పుస్తకాన్ని రాశారు. వారి రచన ముఖ్యోద్దేశం రామజన్మభూమి ఆలయాన్ని పడగొట్టి బాబ్రీమసీదు కట్టలేదని, కాబట్టి రామజన్మభూమిని పునరుద్ధరించడానికి వీలులేదని చెప్పడమే. ఆ పుస్తకం

నిండా అతిశయోక్తులు, బుకాయింపులు, వక్రీకరణలు, బూటకాలు ఉన్నాయి. వారి బుకాయింపుల వలన లాభపడేది ముస్లిములే ఐనప్పటికి ఆలోచనగల ముస్లింలకు కూడా రొమిలా థాపర్ వంటి కుహనా సెక్యులరిస్టుల వ్రాతలు అసహ్యమని పించాయి. అందుకె ప్రొఫెసర్ A. R. ఖాన్ అనే చరిత్రకారుడు రొమిలాథాపర్ బృందం రాసిన పుస్తకాన్ని విమర్శిస్తూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (25-2-1990) లో సుదీర్ఘమైన వ్యాసం రాశాడు. అందులో ఆయన ఇలా అంటాడు- "రొమిలా థాపర్ వంటి చరిత్రకారులు తమ సెక్యులర్ దృక్పధాన్ని చాటించుకునే ఏ ఒక్క అవకాశాన్నీ జారిపోనీయరు. ఆయా సందర్భాలలో వాళ్ళు తల దూర్చి, అతి చొరవ తీసుకుని ప్రాధాన్యత లేని విషయాలకు ప్రాధాన్యత కలిగ్పించి లేనిపోని వివాదాలను లేవనెత్తుతూ ఉంటారు. వాళ్ళు వ్రాసిన పుస్తకం అందుకు ఉదాహరణ."

## చరిత్ర వక్రీకరణ :

గొప్ప చరిత్రకారులుగా పేరుపొందిన రోమిలా థాపర్, సర్వేపల్లి గోపాల్ మొదలైనవారు చరిత్రను వక్రీకరించారు. సాక్ష్యాన్ని తారుమారు చేశారు. తమకు ఉపయోగించే విషయాన్ని మాత్రమే చెప్పి, తమకు పనికి రాని విషయాన్ని దాచిపెట్టారు. ఇదీ వారి చరిత్ర రచన! శాస్త్రీయ దృష్టి! ఈ క్రింది విషయాలు వారిఅశాస్త్రీయ చరిత్ర రచనకీ, కుహన సెక్యుల రిజానికి మచ్చుతునకలు, అయోధ్య నవాబు గొప్ప మతసహన పరుడని, ఉదారుడని నిరూపించేందుకు థాపర్ బృందం క్రింద ఉదాహరణలు చూపారు.

1) "నవాబు సఫర్‌జంగ్ యొక్క దివాను అయోధ్యలో అనేక దేవాలయాలను కట్టించి, మరెన్నో దేవాలయాలను మరమ్మత్తు చేయించాడు.

2) అసఫుద్దౌలా యొక్క దీవాను హనుమాన్ గడీలోని దేవాలయాన్ని కట్టించడానికి సహాయం చేశాడు.

3) నవాబు కొలువులోని ముస్లిం అధికారులు హిందువుల పూజల నిమిత్తం అనేక బహుమానాలను ఇచ్చారు.

పై విషయాలను చదివితే హిందూ ఆలయాలకు సహాయం చేసిన వాళ్ళు ముస్లిములనీ, ముస్లిములై ఉండీ హిందూ దేవాలయాలకు సహాయం చేయడం వారియొక్క ఉదారతకు చిహ్నమనీ సహజంగా అనిపిస్తుంది. కాని అది నిజం కాదు. దేవాలయాలకు సహాయం చేసిన పై దివానులిద్దరూ హిందువులే. కాని రోమిలా థాపర్ బృందం ఆ విషయాన్ని చెప్పకుండా దాచి, వాళ్ళు ముస్లిములే అని భ్రమ కల్పించారు. ఇక మూడవ సందర్భంలో హిందువుల పూజలకు సహాయం చేసినవారు ముస్లిములని నొక్కి చెప్పారు. అంటే ఎక్కడ తమకు అనుకూలమో అక్కడ మాత్రమే నిజాన్ని చెప్పారు. ఏ విషయం తమకు అనుకూలమో ఆ విషయాన్ని మాత్రమే పేర్కొన్నారు. తమ వాదనను బలహీనపరచే ఋజువులను వదిలివేశారు.

ముస్లిం నవాబుల నిష్పక్షపాత బుద్ధిని ఆకాశానికి ఎత్తడం కోసం థాపర్ బృందం ఎంతో తాపత్రయ పడింది. నవాబు వాజిద్ అలిషా కాలంలో నాగా సాధువులకు, సున్నీ, ముస్లిములకు మధ్య జరిగిన ఘర్షణను ఉదాహరణగా చూపిస్తూ ఇలా పేర్కొన్నారు- "హిందువులకు, ముస్లిం మధ్య జరిగే ఘర్షణల్లో ముస్లిం నవాబులు ఎప్పుడూ ముస్లింల పక్షమే వహించారని చెప్పడానికి వీలులేదు. నాగా సాధువులకు, సున్నీ ముస్లింలకు మధ్య జరిగిన ఘర్షణల్లో వాజిద్ అలీషా ముస్లిముల పక్షం వహించలేదు. ఆ విషయాన్ని థాపర్ బృందం తమ వాదనకు ఋజువుగా

చూపారు అలా చూపించడంలో ముఖ్యమైన కొన్ని చారిత్రక సత్యాలను దాచిపెట్టారు. వాజిద్ ఆలీషా మొదలైన అవధ్ నవాబులు ముస్లిములలోని షియా శాఖకు చెందిన వాళ్ళు. షియాలకు, సున్నీలకు పడదు. ఆ మాట కొస్తే, అవధ్ రాజ్యస్థాపన షియా, సున్నీలకు విరోధంనుంచే పుట్టుకు వచ్చిందని చరిత్ర చెపుతుంది. ఈనాటికీ లక్నో ప్రాంతంలో షియా, సున్నీల మధ్య ఘర్షణలు జరుగుతూ ఉండటం మామూలే. నాగా సాధువులతో ఘర్షణ పడిన వాళ్ళు సున్నీ ముస్లిములు. కాబట్టి ఆ సందర్భంలో షియా ముస్లిం అయిన వాజిద్ ఆలీషా తటస్థంగా ఊరుకోవడంలో ఆశ్చర్యమేమీ లేదు. అతడు అలా ఊరుకోవడం, నాగా సాధువులపట్ల అభిమానం కాదు, సున్నీ ముస్లిములపట్ల వ్యతిరేకత మాత్రమే. కానీ ఈ విషయాన్ని థాపర్ వాళ్ళు దాచిపెట్టారు.

అవధ్ రాజ్యం సెక్యులర్ రాజ్యం అని నిరూపించడానికి వాళ్ళు చాలా శ్రమపడ్డారు. నాగా సాధువులు అవధ్ సైన్యంలో ఉండేవారు కాబట్టి అవధ్ సైన్యం, అవధ్ రాజ్యం సెక్యులర్ అని వారి ఉద్దేశ్యం. ఇది శుద్ధ తప్పు. భారతీయ సైన్యంలో హిందువుల సంఖ్య సహజంగానే ఎక్కువ. కాబట్టి నేడు భారతదేశాన్ని హిందూ రాజ్యమని అంటున్నారా? లేదు. రోమిలాథాపర్ వాళ్ళు చేసిన వక్రీకరణలను ఖండిస్తూ, A. R. Khan ఇలా అంటాడు — "ఇటువంటి కృత్రిమపు రాతలవల్ల ఎక్కువ ప్రమాదం ఉంది. నిజాన్ని వక్రీకరించడం ద్వారా దేశభక్తిని, సెక్యులరిజాన్ని పెంచలేము. చరిత్రను వక్రీకరించడం వల్ల అసలు చరిత్ర అంటేనే నమ్మకం సన్నగిల్లే ప్రమాదంఉంది." కొందరు భారతీయ చరిత్రకారులు పక్షపాత దృష్టిలో సెక్యులరిజం పేరున నిజాలను ఎలా వక్రీకరిస్తారో, హద్దుమీరిన వక్రీకరణ ముస్లిములలో కూడా ఎటువంటి వ్యతిరేకతను సృష్టించిందో ప్రొ. ఖాన్ మాటలవల్ల స్పష్టమవుతుంది.

రోమి లాథాపర్ వంటి చరిత్రకారులు హిందువుల మత విశ్వాసాలను, పవిత్ర గ్రంథాలకు, అవతార పురుషులను, ఆచారాలను తమ ఇష్టం వచ్చినట్లు విమర్శించి, అవహేళన చేసి దూషిస్తారు. కాని తమకు సంబంధించినంతవరకూ నిజాలను ముస్లిములే ఒప్పుకునేందుకు సిద్ధమైన స్థితిలో ఆ నిజాలను థాపర్ బృందం నిరాకరిస్తున్నది. కాని ముస్లిములను గురించిన, ముస్లిములే ఒప్పుకోవడానికి సిద్ధపడే నిజాలను చెప్పడానికి కూడా నిరాకరిస్తారు. ఇది ఒక విచిత్రమైన మానసిక రోగం, కుహనా సెక్యులర్ రోగం. అటువంటి రోగాన్ని విమర్శిస్తూ ప్రొ॥ ఖాన్ ఇలా అంటాడు— "రాముడు భగవంతుని అవతారమని హిందువుల నమ్మకం. అది ముస్లిములకు ఖురాన్‌లోగల నమ్మకం వంటిదే. ఈ మేధావులకి ఎవరికైనా ముస్లిముల విశ్వాసాన్ని ప్రశ్నించగలిగే ధైర్యము ఉందా? ఏ సామాజిక శాస్త్రవేత్త కూడా ప్రజా బహుళ్యం యొక్క విశ్వాసాలను విస్మరించలేడు. ఆ విశ్వాసాలను ప్రశ్నించలేడు. ప్రశ్నించడం కన్నా వాటిపట్ల ప్రజలకు ఉన్న భావాలను అర్థం చేసుకోవాలి. అంతేకాని 'చారిత్రక సాక్ష్యాల' పేరు చెప్పి, ఇతరులను మభ్యపెట్టి తమవైపు తిప్పుకోవడం కాదు."

A. R. ఖాన్ వ్రాసిన విమర్శకు రోమిలాథావర్ మొదలైన వాళ్ళు 1-4-90 నాటి ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో జవాబులు వ్రాసారు. అందులో తమ దూకుడును కొంత తగ్గించుకున్నారు. కాని ప్రొ॥ ఖాన్ ప్రశ్నలకు సూటిగా జవాబివ్వకుండా, అనవసరమైన విషయాలను చెప్పి తప్పించుకునే ప్రయత్నం చేసారు. ఖాన్ యొక్క విమర్శలు చారిత్రక పద్ధతి లేదని అతడు కేవలం సాక్ష్యాధారాలను చర్చించాడని ఆరోపించారు. మధ్యలో చారిత్రక పద్ధతి పేరు చెప్పి, దాన్ని గురించి చర్చించడము చారిత్రక విషయాలకన్నా ముఖ్యమైనదనే వితండ వాదన చేసారు. అంతే కాకుండా

అసలు విషయంతో సంబంధంలేని సొద అంతా వెళ్ళబుచ్చారు. రామానలచ్ పంథా గురించి, బౌద్ధుల గురించి చరిత్ర పాఠాలు మొదలుపెట్టారు.

"మసీదు బాబరు ఆజ్ఞలపై నిర్మింపబడింది అనే విషయాన్ని మేము కాదనటంలేదు. కాని మసీదును రాముడు జన్మించిన స్థలంలోగల దేవాలయం స్థానంలో కట్టారనే మాటను వ్యతిరేకిస్తున్నాము"— అని థాపర్ బృందం వాళ్ళు ప్రకటించారు. మనం పైనచూపిన అనేక ఋజువులు బాబ్రీ మసీదును రామజన్మభూమి స్థానంలోనే కట్టినట్లుగా నిరూపిస్తున్నాయి. ఋజువు ఉన్నప్పటికీ ఒక విషయాన్ని ఒప్పుకోక పోవడం చారిత్రక దృష్టి అనిపించుకోదు. అది అశాస్త్రీయమైన దృష్టి. పక్షపాత దృష్టి. తమ జవాబులో చివరిగా ముస్లిములు దేవాలయాలను పడగొట్టి మసీదులను కట్టారనే విషయాన్ని ఒప్పుకుంటూ అందుకు ఆనాటి రాజకీయ పరిస్థితులు కారణమని ఒక కుంటిసాకు చెప్పారు. దీని వల్ల వారు ఏ విషయాన్ని అయితే మొదట ఒప్పుకోలేదో దాన్నే పరోక్షంగా ఒప్పుకున్నట్లు అయింది.

1) ముస్లిం దండయాత్రకారులు హిందూ సమాజంపై చేసిన దాడులు నిజం. 2) తిరిగి రాజకీయ పరిస్థితులు కలసివస్తే, అలాంటి దాడులు చేయడానికి వారు సిద్ధంగా ఉన్నారు.

ఇదీ థాపర్ బృందం వ్రాసిన జవాబు యొక్క సారాంశం. అదే సంచికలో, అదే రోజున ప్రో॥ ఖాన్ వారికి జవాబు వ్రాసాడు. తన జవాబులో రోమిలా థాపర్ మొ॥ వాళ్ళు వదిలివేసిన మరొక సాక్ష్యాధారాన్ని కూడా ఉటంకించాడు. బాబరు నామా బాబరు యొక్క ఆత్మకథ. దానిలో ఇప్పుడు మనకు లభ్యమవుతున్న బాబరు నామాలో సరిగ్గా బాబరు అయోధ్యలో గడిపినకాలానికి సంబంధించిన సమాచారమే మాయం

అయింది. ఆ పేజీలను ఎవరో కాజేసారు. బాబరీ మసీదుకు సంబంధించిన ఆ సమాచారమే మాయం కావడం ఆలోచించదగ్గ విషయమే.

## ముగింపు :

అయోధ్యలో రాముడు జన్మించిన స్థలంలో కట్టబడిన దేవాలయం పురాతనమైనది. అందుకు వాస్తు సంబంధమైన ఆధారాలు, రచనా సంబంధమైన ఆధారాలు, పురావస్తు సంబంధమైన ఆధారాలు, పుష్కలంగా లభిస్తున్నాయి.

అలాంటి పురాతన దేవాలయాన్ని 1928లో బాబరు ఆజ్ఞల మేరకు అతని అనుచరుడైన మీర్‌బాకీ పడగొట్టించాడు - అదే స్థలంలో, అదే దేవాలయానికి సంబంధించిన స్తంభాలను ఉపయోగించి బాబ్రి మసీదు నిర్మింపబడింది.

శాసనపరమైన ఆధారాలు,
రచనా పరమైన ఆధారాలు,
పురావస్తు పరమైన ఆధారాలు,
ఈ విషయాన్ని ధృవపరుస్తున్నాయి.

ఇన్ని ఆధారాలు ఉన్నప్పటికీ రోమిలాథాపర్ వంటి చరిత్రకారులు దేవాలయాన్ని పడగొట్టి, మసీదుని కట్టినట్లు ఆధారాలులేవని చెపుతూ తమ వాదనను బలపరుచుకోవడానికి కొన్ని సాక్షాధారాలను విడిచిపెట్టి, మరికొన్ని ఆధారాలను తమకు అనుకూలంగా మలచుకొని ఒక పుస్తకం వ్రాసి ప్రచారం చేస్తున్నారు ఆ ప్రచారంలోని అబద్ధాలను, అభూత కల్పనలను A. R. ఖాన్ అనే చరిత్రకారుడు నిర్ద్వందంగా ఖండించాడు.

ఒక్క మాటలో చెప్పాలంటే, ఎవరు ఎన్ని రకాలుగా బుకాయిం చినా, రాముడు జన్మించినది అయోధ్యలోనే ఇదే హిందువుల, తరతరాల విశ్వాసం. రాముడు జన్మించిన చోట నిర్మించిన రామజన్మ భూమి మంది రాన్ని బాబరు ఆజ్ఞతో అతని అనుచరుడు బీర్‌బాకి కూల్చి బాబరీ మసీదు నిర్మాణం చేసే ప్రయత్నం చేశాడనేది నగ్నసత్యం.

చరిత్రను వక్రీకరించే కుహనా చరిత్రకారులు, కుహనా సెక్యులర్ వాదులు ఉండటం ఈ జాతి దురదృష్టం. విదేశీ ఆక్రమణదారులు, ఈ జాతికి కలిగించిన కళంకం అయోధ్య ఒక్కటేకాదు. కృష్ణజన్మభూమి, మధుర, కాశీ విశ్వేశ్వరాలయం, ఇంకా అనేక వేల మందిరాలు దేశవ్యాప్తంగా ఉన్నాయి. ఆక్రమణదారులచే ధ్వంసం చేయబడి, మసీదుగా మార్చబడిన సోమనాథ దేవాలయాన్ని స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే, బాబూ రాజేంద్ర ప్రసాద్, సర్దార్ వల్లభభాయి పటేల్‌ల చొరవతో మహాత్మాగాంధీ ఆశీస్సు లతో ప్రభుత్వమే పునర్నిర్మించి, తరతరాల కళంకాన్ని కడిగివేసిన విధంగా, అయోధ్య, మధుర, కాశీ దేవాలయాలనికూడా పునర్నిర్మించ వలసివుంది. అది జరుగకపోగా ప్రజలే తమ విశ్వాసాల కనుగుణంగా తమ జాతీయ గౌరవ కేంద్రాల విముక్తికి ఉద్యమించి ముందుకు వచ్చిన ఈ తరుణంలో, అడ్డు తగిలే అరాచక వాదులను అణచివేసి, నిరాటం కంగా అయోధ్యలో ఆలయ నిర్మాణాన్ని పూర్తిచేయాలి.



# రామజన్మభూమి హిందువులదే

## —కాంగ్రేసు నాయకుడు బన్వారీలాల్ పురోహిత్

రామజన్మభూమి విషయంలో నాగపూర్ ప్రాంతం లోక్‌సభ సభ్యుడు శ్రీ బన్వారీలాల్ గత లోక్‌సభ సమావేశాల్లో చేసిన వ్యాఖ్యానాలు రాజకీయలోకంలో ఆలోచనలకు తావిచ్చాయి. ఆయన రామజన్మభూమి హిందువుల కిచ్చి వేయాలన్నాడు. కాంగ్రేసు సెక్యులరిజం ఇలా వుందని ఆయన అపహసించాడు.

"నేను, అంటే ఈ బన్వారీలాల్ పురోహిత్‌ను షాహి ఇమాం వెంబడిపోతే సెక్యులర్‌ను అవుతాను. హిందూ ధర్మగురువు శ్రీశంకరాచార్యుల వెంబడి వెళ్ళితే మతవాదినవుతాను. ఇది ఈ దేశంలో సయ్యద్ షాబుద్దీన్లు, సులేమాన్‌సేట్లు తయారు చేశారు. మతం గురించి తప్ప మరే సంగతి మాట్లాడనివారే వీళ్ళన్న సంగతి అందరికీ తెలుసు."

"రామచంద్ర ప్రభువు అయోధ్యలోనే జన్మించాడు. ఈ విషయంలో అభిప్రాయాల భేధాలెవరికీ లేవు. అందుకే రామజన్మభూమి హిందువుల కివ్వాలంటున్నాను. మక్కా_మదీనాల్ని తొలగించాలని ఎవరన్నా అంటే నేను దానిని కూడా వ్యతిరేకిస్తాను. తీర్థ స్థానాలైన వాటిని తొలగించాలని ఎవరైనా అంటారా! అయోధ్యలోని రామజన్మభూమి కూడా అటువంటి పవిత్రస్థలమే. ఇక తప్పదనుకుంటే ఆ రామజన్మభూమికి అయిదారు కిలోమీటర్ల దూరంలో మరో మసీదు కట్టుకోవచ్చు. రామమందిరం మీద బలవంతంగానిలబెట్టిన గుమ్మటాల్ని అలాగే తీసుకొనివచ్చి ఈ మసీదుమీద పెట్టుకోవచ్చు."

* * *

**1989, జులై 7, 8, 9 తేదీలలో నాగపూర్‌లో సమావేశమైన రాష్ట్రీయ స్వయంసేవకసంఘ్ అఖిల భారత కార్యకారీ మండలి ఆమోదించిన తీర్మానంలోని కొద్దిభాగం ఈ క్రింద ఇస్తున్నాం—**

అనాది కాలం నుండి కోట్లాది హిందువుల హృదయసీమలలో విరాజిల్లుతూ ఉన్న భగవాన్ శ్రీరామచంద్రుని జన్మస్థలం న్యాయవిచారణ జరిపించవలసిన అంశంగా చేయడం ఎంతమాత్రం తగదని అఖిల భారత కార్యకారీ మండలి నిర్దిష్టంగా అభిప్రాయ పడుతున్నది. ఇటువంటి విషయాలలో ప్రభుత్వం అనుసరిస్తున్న ద్వంద్వ వైఖరిని ప్రజలదృష్టికి తీసుకురావాలని కోరుతుంది. ప్రవిత్ర గ్రంథంపైన విచారణ జరుపే అధికారం న్యాయస్థానాల పరిధిలో లేదనే వాదంతో కలకత్తా హైకోర్టులో విచారణలోవున్న పవిత్రఖురాను గ్రంథంపై కేసును ఉపసంహరింపచేయటంలో తాను ప్రముఖ పాత్ర వహించినట్లు శ్రీరాజీవ్‌గాంధి స్వయంగా చెప్పిన విషయం రికార్డులలో వుంది. అలాగే షాబానో కేసులో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు ఎటువంటి ప్రభావాన్ని చూపకుండా చేసేందుకు చట్టాన్నే మార్పు చేసినట్లు (నిజానికి ఇలా చేయటం ద్వారా ముస్లిం మహిళ న్యాయపర మైన హక్కులను అణగ ద్రొక్కారు) ఇదంతా ముస్లిం మత విశ్వాసాలకు తగిలిన గాయాలను నయం చేసేందుకేనని ఆయన స్వయంగా పేర్కొన్నారు. అయితే రామజన్మభూమి విషయంలో మాత్రం కోర్టులలో నిర్ణయించవలసిన అంశంగా చేయటానికి కంకణం కట్టుకున్నారు. లౌకికవాదిగా (సెక్యులర్) తనను ప్రకటించుకున్న ఈ ప్రభుత్వం అనుసరిస్తున్న ఈ వివక్షతకు అఖిల భారత కార్యకారి మండలి తీవ్రంగా నిరసన వ్యక్తం చేస్తున్నది.

రామజన్మభూమిలో ఉన్న, మసీదుగా చెప్పబడుతున్న కట్టడపు అవశేషాలను తొలగించమని, భగవాన్ శ్రీరామునికి నిర్మించ తలపెట్టిన దేవాలయం కోసం ఆ స్థలాన్ని ఖాళీ చేయగలమని కొన్ని ముస్లిం సంస్థలు చేసిన ప్రతిపాదనను అఖిల భారతీయ కార్యకారీ మండలి ప్రశంసి స్తున్నది. వారి బాటలోనే తాము కూడా పయనించడం ద్వారా మిగిలిన ముస్లింలు కూడా హిందువుల ఎడల సోదర భావనను ప్రదర్శించమని అఖిల భారతీయ కార్యకారీ మండలి విజ్ఞప్తి చేస్తున్నది.

